**జవాబు :-** క్రొత్త నమాజు విషయము ప్రక్కన పెట్టి పాత నమాజు విషయమునకు (ప్రతి దినము చేసే నమాజు విషయమునకు) వచ్చి చూస్తే ఖుర్ఆన్ గ్రంథములో ఎక్కడా నమాజ్ నిర్వహించే క్రమము అని అల్లాహ్ చెప్పియుండలేదు. అయితే ముస్లీమ్ పెద్దలుగానీ లేక ముహమ్మద్ ప్రవక్తగారు గానీ నమాజు చేయు పద్ధతిని తెలిసి ఆచరించి చూపుట వలన వారి తర్వాత వీరు అలాగే చేయను మొదలు పెట్టారు. అల్లాహ్ ఆకాశవాణి ద్వారా (వహీ ద్వారా) దైవజ్ఞానమును అందించాడు. నమాజులో పఠించు ఏడు ఆయత్‌లను కూడా అల్లాహ్ చెప్పలేదు. మనుషులు అల్లాహ్ గొప్ప తనాన్ని నాలుగు వాక్యములుగా, మనుషుల అవసరమును కోరుచూ మూడు వాక్యములుగా చెప్పుకొన్నారు. అలా చెప్పిన వాక్యములనే నమాజ్‌లో మంత్రములుగా చెప్పుచున్నారు. ఏడు వాక్యములను చదవనిదే అది నమాజ్ అనిపించుకోదుయని చాలామంది ముస్లీమ్ పెద్దలు చెప్పియున్నారు. నమాజ్‌లో ఏడు వాక్యములను తప్పనిసరిగా మంత్రపఠనము లాగా చదువవలసి యుండును. అయితే ఈ విషయమును అనగా ఏడు ఆయత్‌లను చదివే విషయమును దైవ గ్రంథమయిన ఖుర్ఆన్ గ్రంథములో అల్లాహ్ చెప్పినట్లు జిబ్రయేల్ ఎక్కడా ఏ సూరాలో, ఏ ఆయత్‌లో చెప్పలేదు.

వాస్తవముగా అల్ ఫాతిహా అను ఏడు ఆయత్‌లను మనుషులు ప్రార్థన కొరకు సృష్టించుకొన్నదేగానీ దేవుడు చెప్పినది గాదు. ప్రార్థన విషయమును ప్రత్యేకించి అల్లాహ్ చెప్పియుండలేదు. గడచిన మూడు యుగములలోనూ, తర్వాత గడచుచున్న కలియుగములోను అనేకులు అనేక ప్రార్థనలను చేయుచున్నారు. ముందే తయారయిన హిందూ మతములో అనేక దేవతారాధనలు గలవు. అట్లే ఇస్లామ్‌కంటే ముందు తయారయిన క్రైస్థవములో కూడా ప్రార్థనలు కలవు. కలియుగములో 3600

సంవత్సరముల తర్వాత ఇస్లామ్ సమాజము తయారయినది. అంతవరకు అందరూ చేయు ప్రార్థనలలాగే ముస్లీమ్‌లు నమాజు అను పేరుతో ప్రార్థనను తయారు చేసుకొన్నారు. అందులో మొదటి నుండి చివర వరకు చేయు విధానము, చదువు వాక్యములు అన్నియూ మనుషులు కల్పించుకొన్నవే. ఖుర్‌ఆన్‌ను గ్రంథముగా వ్రాయకముందే ముస్లీమ్‌లలో ప్రార్థన విధానమును ముహమ్మద్ ప్రవక్తగారు ప్రవేశపెట్టారని చెప్పవచ్చును. ముస్లీమ్ సమాజము ఏర్పడినప్పటి నుండి నమాజు అను ప్రార్థనయున్నా అది ఇతర మతస్థులు ఆచరించునట్లు అచరించుట వలన, అది ఒక విధమైన ప్రార్థనే అయినా, దానిని చేయువారు అట్లే చేస్తూ క్రొత్త నమాజును స్థాపించమని 4-103లో చెప్పియున్నారు. పాత నమాజు వలన మనిషికి పరలోక ప్రాప్తి యుండదనీ, మిగతా మతములు వారు చేయు ప్రార్థనలకు కూడా మోక్షము (పరలోకము) లభించదని దేవుడు తెలియజేసినట్లు ఇంకొక నమాజును (ప్రార్థనను) చెప్పడమైనది.

పాత నమాజును చేస్తూనే క్రొత్త నమాజు అర్థమయినప్పుడు పరిస్థితులన్నీ అనుకూలించినప్పుడు నమాజును స్థాపించమన్నారు. పాత నమాజులోని లోపమును చూపిస్తూ నిలబడినప్పుడు, కూర్చుండినప్పుడు, పరుండినప్పుడు అల్లాహ్‌ను (దేవున్ని) స్మరించుము అన్నాడు. అలా స్మరణ ఉండుట కొరకే క్రొత్త నమాజు అవసరమైనది.

పాత నమాజు చేసినంతసేపు దేవుని జ్ఞాపకము ఉండును. చేయనప్పుడు దేవుని జ్ఞాపకము ఉండదు. అందువలన శరీరము మూడు స్థితులలో యున్నప్పుడు దేవుని స్మరణ చేయమని చెప్పిన అల్లాహ్ ఆ విధానమును నమాజ్ అని చెప్పుచూ దానిని స్థాపించమని చెప్పాడు.

ఆయన ప్రజలకు మంచి చేయుటకు, పరలోకము లభించునట్లు చేయుటకు నమాజ్‌ను స్థాపించమని చెప్పాడు కదా! మనిషికి ఆ నమాజు (ప్రార్థన) ఎలాగుండునో తెలియనప్పుడు ఎలా స్థాపించునను ప్రశ్న ఇప్పుడు అందరికీ వచ్చినది. అయితే దానికి జవాబుగా ఇట్లు చెప్పుటకు వీలుకలదు. ఇంతకు ముందు చెప్పిన జ్ఞానము ప్రకారము అనగా! రెండు, మూడు సూరాలలో చెప్పిన జ్ఞానము ప్రకారము మనిషి ఎల్లవేళల, మనిషికి జ్ఞాపకమున్న (ఎరుక యున్న) సమయములలో ఒక్క క్షణము కూడా దేవున్ని మరచిపోకుండా ఉండుటకు తగినది చెప్పబడియున్నది. రెండు సూరాలలోనేకాక, ఆరవ సూరాలో కూడా దేవుడు సూచించిన నమాజు కలదు. అందువలన ఖుర్ఆన్ చదివిన ఏ వ్యక్తి అయినా అంతకుముందు చేయు ఆరాధన చేయుచూ, దాని తర్వాత నిలుచున్నా, కూర్చున్నా, పరుండినా చేయబడు నమాజును స్థాపించవచ్చును. అయితే దేవుడు చెప్పిన ఈ నమాజు ప్రార్థన మందిరములో చేయునది కాదు. బజారులో నిలబడినప్పుడుగానీ, హోటల్‌లో కూర్చున్నప్పుడుగానీ, పరుపు మీద పడుకొన్నప్పుడుగానీ దేవుడు సూచించిన నమాజును చేయవచ్చును. నిలబడి నడుస్తునప్పుడు బజారులోని దృశ్యములను చూస్తూ, కూర్చుండి మాట్లాడుచున్నప్పుడు ఇతరులతో వాదించుచూ గానీ, పడకలో పరుండి భార్యాపిల్లలతో సంతోషముగా మాట్లాడునప్పుడుగానీ, పూర్తి నమాజుగాయుండు ఆరాధనను చేయవచ్చును.

పాత నమాజు ప్రతీ దినము నియమింపబడిన కాలములో చేయుచున్నా దానికి కొన్ని విధివిధానములు గలవు. క్రొత్త నమాజులో అటువంటివి ఏవీ లేవు. పాత నమాజులో ఏడు ఆయత్‌లు చదవడము, మోకాల్ల మీద కూర్చొని వంగి తల భూమికి పెట్టి ప్రార్థన చేయడము గలదు. క్రొత్త నమాజులో అటువంటి క్రియలు ఉండవు. పాత నమాజులో

నిర్ణీత సమయముండును. క్రొత్త నమాజులో సమయము ప్రత్యేకించి యుండదు. అన్ని సమయములలో ఆచరించునదిగా ఉండును. పాత నమాజులో సాముహికముగా జనముతో కూడి చేయడము గలదు. అయితే క్రొత్త నమాజులో ప్రక్క మనిషితో సంబంధము లేకుండా అడవిలో అయినా ఒక్కడే చేయవచ్చును. ఇట్లు ఎన్నో తేడాలు ఉండుట వలన పాత నమాజును చేస్తూ క్రొత్త నమాజును నెలకొల్పమన్నాడు. అలా నెలకొల్పడము వలన పాత నమాజును చేసే సమయములో కూడా పాత నమాజును చేస్తూనే క్రొత్త నమాజును దానిలోనే మిళితముగా చేయవచ్చును. నీ శరీరము ఏమి చేయుచున్నా, నిలబడి గానీ, కూర్చుండిగానీ, పరుండి గానీ యున్నా ఏమి చేయుచున్నా దానిని వదలక క్రొత్త నమాజును చేయవచ్చును. ఇదంతా పెద్ద విచిత్రముగా ఏదో మాయాలాగా ముందు కనిపించినా, తెలిసిన తర్వాత క్రొత్త నమాజు ఎంతో సులభమైనదని అనిపించును.

**ప్రశ్న :- నేడు ముస్లీమ్‌లు అల్లాహ్ (దేవుడు) అనినా, ముహమ్మద్ ప్రవక్త అనినా ఎంతో ఇష్టముగా యుండుటేగాక వారి మాటను ఎంతో గౌరవముగా స్వీకరిస్తారు, ఆచరిస్తారు. అటువంటప్పుడు ముస్లీమ్ సమాజములో నమాజు ఒక్కటేకలదు. దానిని నిర్ణీత సమయములలో అందరూ కలిసి సామూహికముగా, క్రమశిక్షణగా, శుచిశుభ్రతలతో, కాళ్లు, చేతులు, ముఖము కడుగుకొని ప్రార్థనలో (నమాజులో) పాల్గొని తృప్తి పొందుచున్నారు. కొందరికి వీలయితే ఐదుపూటలు నమాజ్ చేయువారు కలరు. అంతేకాక ముస్లీమ్‌లు అంటే విశ్వాసము, విశ్వాసము అంటే ముస్లీమ్‌లు అనునట్లు గలదు. ఖుర్ఆన్ గ్రంథమును ఎంతో గౌరవముగా చదివి దానిలో దేవుడు చెప్పిన సూచనలను తెలియుచుందురు. అంత భక్తిగా యున్నవారికి మీకు**

**తెలిసిన రెండవ క్రొత్త నమాజు తెలియకుండునా?అట్లు యున్నట్లు హదీసు పండితులకుగానీ, ఖుర్ఆన్ బోధకులకు గానీ తెలియదా? మీరు చెప్పేంత వరకు వారికి తెలియదంటారా? మసీదులలో ఇమాంసాబ్‌లు నిత్యము ఖుర్ఆన్ పఠనము చేయుచుందురు. వారు కూడా మీరు చెప్పిన దానిని చెప్పలేదే? మీరు తెలుగులో వ్రాసిన ఖుర్ఆన్‌ను చదివి చెప్పుచున్నారు. ఖుర్ఆన్ గ్రంథము అరబ్బీ భాషలో వ్రాయబడినది. అరబ్బీ భాషా పండితులు మీరు చెప్పిన వాక్యమును చదివియుంటారు కదా! మీరు చెప్పిన (4-103) వాక్యములో ఇంకో నమాజును గురించి దానిని నెలకొల్పమని చెప్పిన దానిని గురించి చెప్పినది తెలిసియుండదా? అరబ్బీ పండితులకు తెలియని విషయమును మీరు చెప్పుచున్నారా? అని మాకు అనుమానము (ప్రశ్న) వచ్చుచున్నది. దీనికి మీరు ఏమి జవాబు చెప్పగలరు?**

**జవాబు :-** ఖుర్ఆన్ గ్రంథమును అరబ్బీ భాషలో వ్రాసిన మాట నిజమే. అరబ్బీ, తెలుగు తెలిసిన పండితులు అరబ్బీ భాషలోని ఖుర్ఆన్ గ్రంథమును తెలుగులో అనువదించి వ్రాశారు. అలా తెలుగు అనువాద గ్రంథములు నావద్ద ఏడు గ్రంథములు గలవు. అన్ని గ్రంథములలోను (4-103) ఆయత్‌ను చూస్తే అన్నీ ఒకే అర్థము ఇచ్చునవిగా గలవు. కొన్ని గ్రంథములలోని పదములు వేరుగాయున్నా అర్థము ఒకే విధముగా యున్నది. ఒక గ్రంథములో నమాజును స్థాపించండి అని వ్రాశారు. మరొక గ్రంథములో నమాజును నిర్మించండి అని గలదు. ఇంకొక దానిలో నమాజును నెలకొల్పండి యని కలదు. మూడు తెలుగు అనువాద గ్రంథములలో వేరువేరు పదములుగా నిర్మించండి, స్థాపించండి, నెలకొల్పండి యని యున్నా అన్నీ ఒకే అర్థమును చూపుచున్నవి.

అటువంటప్పుడు భాషను చూడక భావమును చూడవలెను. ఇటువంటి ప్రశ్న వస్తుందేమోనని ముందుచూపుగా ఒకే ఆయత్‌ను మూడు గ్రంథములనుండి సేకరించి మూడు విధముల వ్రాసి చూపాను. ఆ మూడు ఆయత్‌లు కొద్దిగా పదాలు వేరుగా యున్నా భావములో అన్నీ ఒకే విధముగా యున్నవని చెప్పవచ్చును. తర్వాత ఇస్లామ్‌లో ఎందరో పండితులు భక్తులు ఉన్నారు. అయితే 4-103 లో క్రొత్త నమాజును కూడా పాత నమాజుగా వారు లెక్కించుకొని క్రొత్త దానిని కూడా పాతదానిగానే చెప్పుచున్నారు. ఎన్నిచోట్ల చెప్పినా ఉన్నది ఒకే నమాజు కదా!యని అంటున్నారుగానీ వాక్యములోని హెచ్చుతగ్గులను, సూక్ష్మాతి సూక్ష్మములను తెలియలేకున్నారు. అలా నమాజ్ ఒక్కటేయని, అల్లాహ్ ఒక్కడేయని నిర్ధారణలో ఉండుట వలన క్రొత్త నమాజ్ వారికి తెలియకుండా పోయినది.

**ప్రశ్న :- ఇంత పెద్ద ముస్లీమ్ సమాజములో, ఖుర్‌ఆన్ వాక్యమునందు నమాజ్ స్థాపించండి, నెలకొల్పండి అని వ్రాసిన పదము అర్థముకాక చెప్పిన నమాజ్‌ను పాత నమాజ్ అనుకున్నారా? ఒక్కరు కాకపోతే మరొక్కరికయినా దాని భావము అర్థము కాలేదా? ఇస్లామ్ పండితులకంటే నీవు పెద్దవాడివా, వారికి అర్థము కానిది నీకు అర్థమయినదని మేము ఎట్లు నమ్మాలి? నీవు ఇందూ సమాజములోని వానివి. హిందూ సమాజములోని మనిషి (మీరు) ఖుర్‌ఆన్ గ్రంథము చదివి అర్థము చేసుకొన్న దానిని ఇస్లామ్ పండితులకు అర్థము కాలేదని చెప్పగలరా?**

**జవాబు :-** సత్యమును సత్యముగానే చెప్పితే అల్లాహ్ సంతోషిస్తాడుగానీ, సత్యమును అసత్యముగా చెప్పితే అల్లాహ్ ఏమాత్రము ఒప్పుకోడు. దేవుడు అంటే ఎంతో నాకు భయము కలదు. అట్లే భక్తీ కలదు. సత్యము అంటే

కూడా భయము కలదు. దేవుడు, దేవుని బోధలు సత్యసమేతముగా ఉండును. అందువలన సత్యమును అసత్యముగా చెప్పుట పెద్ద తప్పుగా భావింతును. వాస్తవముగా ఖుర్ఆన్ గ్రంథము నాకు అర్థమయినట్లు ఇతర ముస్లీమ్‌లకు అర్థము కాలేదనియే చెప్పుచున్నాను. హిందూ సమాజములో పుట్టిన వానికి అర్థము అయినప్పుడు, ముస్లీమ్ సమాజాములో పుట్టినవారికి అర్థము కాకుండా పోవునా? ఇది నమ్మవలసిన మాటేనాయని అడుగవచ్చును. అట్లు అడగడములో తప్పులేదుగానీ సత్యము తెలిస్తే మీరు ఎవరూ ఈ మాటను అడుగరు. అందరికీ తెలియని సత్యము ఏమనగా!

ఖుర్ఆన్ గ్రంథములో ఎన్నో గొప్పవాక్యములు గలవు. ఇప్పుడు వజ్రవాక్యములను పేరుతో ఈ గ్రంథమును వ్రాయుచున్నా, వాస్తవముగా చూస్తే వజ్రవాక్యములు అను పేరు కూడా ఒక విధముగా ఈ గ్రంథమునకు తక్కువేయని చెప్పవచ్చును. వజ్రాలకంటే ఎక్కువ విలువయిన వాక్యములు ఖుర్ఆన్ గ్రంథములో గలవు. ఖుర్ఆన్ గ్రంథము ఏ మనిషికి అర్థము కావాలన్నా, మతముతో సంబంధము లేకుండా ముస్లీమ్‌కుగానీ, హిందువులకుగానీ, క్రైస్థవులకుగానీ ఎవరికి అర్థము కావాలన్నా మిగతా రెండు గ్రంథములు చదివిన వారికే అర్థమగును. ఎవడయితే మూడు దైవ గ్రంథములలో మిగతా రెండు గ్రంథములు చదవకపోతే ఖుర్ఆన్ అర్థము కాదు. మిగతా రెండు దైవగ్రంథములయిన భగవద్గీత, బైబిలు చదివి అర్థము చేసుకొనియుంటే వానికి ఖుర్ఆన్ గ్రంథము సులభముగా అర్థము కాగలదు. నేను భగవద్గీతను, బైబిలును వివరముగా చదువగలిగాను. చదవడమేకాక బాగా అర్థము చేసుకొన్నాను. అందువలన మూడవ గ్రంథమయిన ఖుర్ఆన్ గ్రంథము బాగా అర్థమవుచున్నది. ముస్లీమ్‌లకు కూడా తెలియని రహస్య భావములు నాకు తెలియుచున్నవి.

వాస్తవానికి (4-103) వ వాక్యము చిన్న వాక్యము. అందులో మూడే ముక్కలు గలవు. ఒకటి పాత నమాజును చెయ్యి, తర్వాత ఎక్కడున్నా ఏ పరిస్థితిలోయున్నా అని చెప్పుచూ నిలుచున్నా, కూర్చుండినా, పరుండినాయని అన్నారు. ఆ తర్వాత సమయము అనుకూలిస్తే, నమాజును నెలకొల్పమని చెప్పాడు. నమాజును నెలకొల్పమని చెప్పినది అన్ని గ్రంథములలో గలదు. అందరూ దానిని చదివినా పాత నమాజును తప్పనిసరిగా శ్రద్ధగా ఆచరించడమే నమాజును నెలకొల్పినట్లు తలచుచున్నారు. గ్రంథములో మా బుద్ధికి క్రొత్త నమాజుగా కనిపించుచున్నది. దానికి ఒకే ఒక కారణము గలదు. అదే వారు ఖుర్ఆన్ గ్రంథమును అర్థము చేసుకోలేదని ఆ కారణము చేతనే క్రొత్త నమాజ్ కూడా పాత నమాజ్ మాదిరే అర్థమయినదని చెప్పవచ్చును. అలా అర్థము కాకపోవడానికి ముస్లీమ్‌లు భగవద్గీతను, బైబిలును చదవలేదు. రెండు గ్రంథములను చదవనిదే మూడవ గ్రంథము అర్థముకాదని నేను కొన్ని సంవత్సరములనుండి చెప్పుచూనే యున్నాను.

భగవద్గీత (తౌరాతు), బైబిలు (ఇంజీలు), ఖుర్ఆన్ మూడు దైవ గ్రంథములేయని చెప్పవచ్చును. ఒక దైవ గ్రంథము అర్థము కావాలంటే మిగతా రెండు దైవ గ్రంథములను తప్పనిసరిగా చదువవలసిందే. మనిషి ఏ ధర్మములో యున్నా ఆ ధర్మము వానికి తెలియాలంటే మిగతా రెండు గ్రంథములను చదవవలెను. ఇది అల్లాహ్ ఐదవ సూరాలో 68వ ఆయత్‌లో ఇలా ఆజ్ఞ చేసి చెప్పాడు చూడండి. అక్కడ చెప్పిన వాక్యము అనుసరించి మనిషి ధర్మము నిర్ణయించబడును.

**(5-68) "ఓ గ్రంథవాహకులారా! మీరు తౌరాతు, ఇంజీలును, మీ ప్రభువు వద్ద నుండి వచ్చిన మీ వద్దకు పంపబడిన దానిని**

**(ఖుర్ఆన్ గ్రంథమును) మీ జీవితాలలో నెలకొల్పు వరకు మీరు ఏ ధర్మముపైనా లేనట్లే"**

ఈ వాక్యము ఖుర్ఆన్ గ్రంథములో ముస్లీమ్‌లకే చెప్పియున్నారు కదా! అటువంటప్పుడు ముస్లీమ్‌లు భగవద్గీత, బైబిలు చదవనిదే ఖుర్ఆన్ గ్రంథములో ఆయత్‌లు సక్రమముగా అర్థము కావు. దేవుని నియమము ప్రకారము నడుచుకోని వారికి వారి ధర్మము వారికే తెలియదు. ఇది ముస్లీమ్‌లకే కాదు, అన్ని మతముల వారికి వర్తించును. అందువలన తమ మత గ్రంథమని ఒక గ్రంథమును ఆశ్రయించి మిగతా రెండు దైవ గ్రంథములను పరమత గ్రంథములుగా అసూయతో చూచువారికి ఎంత కాలమునకయినా వారి గ్రంథములలోని జ్ఞానమే అర్థము కాదు. నేడు హిందువులు బైబిలును పరమత గ్రంథము అని అసూయతో చూస్తున్నారు. అట్లే ఖుర్ఆన్ గ్రంథమును కూడా పరమత గ్రంథమని దూరముగా పెట్టారు. అందులో ఏమున్నది ఆ రెండు గ్రంథముల జ్ఞానము తెలియదు కావున అటువంటి వారికి భగవద్గీత జ్ఞానము కూడా తెలియదు. అంతేకాక మేము హిందువులమని చెప్పుకొనుచుండినా వారికి హిందూ ధర్మము ఏదో తెలియకుండును. ఒక దైవగ్రంథములోని జ్ఞానము అర్థము కావాలంటే మిగతా రెండు దైవ గ్రంథముల జ్ఞానము తెలిసియుండాలి. ఈ సూత్రము తెలియని దానివలన ముస్లీమ్‌లకు వారి ఖుర్ఆన్ గ్రంథములో ఆయత్‌లు అర్థము కావడము లేదు.

నేను భగవద్గీత, బైబిలు రెండు గ్రంథములు చదివాను కావున ఖుర్ఆన్ అర్థమగుచున్నది. అలాగే ఖుర్ఆన్, బైబిలు చదివియుండుట వలన భగవద్గీత అర్థమగుచున్నది. అట్లే భగవద్గీత, ఖుర్ఆన్‌ను చదివి

యున్నాను కావున నాకు బైబిలు సులభముగా అర్థమగుచున్నది. ముస్లీమ్‌లకు (4-103)లో యున్న వాక్యములో క్రొత్త నమాజ్ అర్థము కాలేదంటే, క్రొత్త నమాజు ఉన్నదని తెలియలేదంటే వారికి మిగతా రెండు గ్రంథముల జ్ఞానము తెలియదనే చెప్పవచ్చును. దేవుడు ఒక సూత్రమును ఒక దైవ గ్రంథములలో చెప్పితే మూడు దైవగ్రంథములలో ఆ సూత్రము ఉన్నట్లేయగును. మూడు దైవగ్రంథములలో ఒకే దేవున్ని గురించి చెప్పియుండుట చేత ఒక జ్ఞాన సూత్రము ఒక దైవ గ్రంథములో చెప్పితే అది మిగతా రెండు దైవగ్రంథములలో చెప్పినట్లుగా లెక్కించవలెను. చెప్పునది ఒకే దేవున్ని అయినందున ఒకే సూత్రము మూడు గ్రంథములలో సమానముగా వర్తించును.

ఒక బ్యాంకు లాకర్‌లో సొమ్మును దాచుకొన్నప్పుడు, బ్యాంకు లాకర్‌కు రెండు తాళము చెవులు ఉండును. ఒకటి ఖాతాదారునికి ఇచ్చి రెండవ దానిని బ్యాంకు మేనేజర్ ఆధీనములో ఉంచుకొనును. లాకర్‌లో సొమ్ము కావలసి వస్తే నీ వద్ద యున్న తాళము చెవితో మాత్రము లాకర్ తెరుచుకోదు. బ్యాంక్ మేనేజర్ వద్దయున్న తాళము చెవి నీవద్ద యున్న తాళము చెవి రెండూ ఉపయోగించినప్పుడు బ్యాంక్‌లాకర్ తెరుచుకొని అందులోని సొమ్ము లభించును. ఇక్కడ బ్యాంక్ లాకర్ తెరవటానికి రెండు తాళము చెవులు అవసరమైనట్లు ఒక తాళము చెవితో లాకర్ తెరుచుకోనట్లు ఒక గ్రంథము చదివితే దేవుని జ్ఞానము లభించదు. రెండు తాళములు ఉన్నప్పుడే లాకర్ తెరచుకొన్నట్లు ఎప్పుడయినా ఇతర మత గ్రంథములని అసూయ చెందక చదివినప్పుడు గ్రంథములోని వాక్యమందు గల జ్ఞానము లభించును. నేడు ఎక్కడ చూచినా ఒక మతము రెండవ మతము మీద ద్వేషము కల్గియున్నది. అందువలన ఎవరికీ దైవ గ్రంథములలోని జ్ఞానము

అర్థము కావడము లేదు. దేవుడు అన్ని మతములకు ఒక్కడే అయినప్పుడు అన్ని మతములలోని జ్ఞానము ఒక్కటే యుండును గానీ, వేరుగా యుండుటకు అవకాశముండదు. ఆ విషయము తెలియక ప్రతి ఒక్కరూ మత ద్వేషమును కల్గి ఇతర దైవ గ్రంథములోని జ్ఞానము తెలియని దానివలన ఒక మతములోని జ్ఞానము ఆ మతములోనే అర్థము కాకుండా పోయినది. ముఖ్యముగా అదే కారణము చేత వాక్యములో నమాజును నెలకొల్పమని చెప్పినా, అది ఏ నమాజో ముస్లీమ్‌లకే అర్థము కాకుండా పోయినది.

ఖుర్‌ఆన్ గ్రంథములో ఈ మాట ఉన్నది. కావున ముస్లీమ్‌లకే ఈ విషయము బాగా అర్థము కావలసియున్నది. అయితే వారు చేయుచున్న నమాజ్‌కు, క్రొత్తగా స్థాపించబడవలసిన నమాజ్‌కు ఏమి తేడా యున్నదని వారు కొంచెమయినా ఆలోచించలేదు. (4-103) వ ఆయత్ ఖుర్‌ఆన్ గ్రంథములో చేయుచున్న నమాజును గురించి చెప్పడమేకాక, క్రొత్తగా నెలకొల్పు నమాజ్‌ను గురించి కూడా చెప్పాడు. ఇది అల్లాహ్ నుండి వచ్చిన జ్ఞానముకాగా, దానినే జిబ్రయేల్ ముహమ్మద్ ప్రవక్తగారికి చెప్పాడు. ఈ జ్ఞానమును సృష్ఠి మొదలయిన తర్వాత కొంత కాలానికే వాణి (శబ్దము) ద్వారా వచ్చినది. ఆ శబ్దము ఆకాశము నుండి వచ్చినది. ఆ రోజు అది మాటల రూపములో రాలేదు. ఆకాశము నుండి ఎలా శబ్దము వచ్చునో అలాగే ఉరుముల రూపములో వచ్చినది. అలా ఉరుముల రూపములో వచ్చిన శబ్దమును విని, గ్రహించుకొన్న సూర్యుడు కొంతకాలానికి భూమి మీద 'మనువు' అను వ్యక్తికి తాను వినిన శబ్దములను మనుషుల మాటల రూపములోనికి మార్చి చెప్పాడు. సూర్యుడు ఏ శబ్దములోని భావమును గానీ, ఏ భాషలోని భావమునుగానీ గ్రహించుశక్తి గలవాడు, అలాగే ఏ భాషలోనయినా మాట్లాడు స్థోమత గలవాడు. అన్ని భాషలను గ్రహించుశక్తి

ఆయనకు గలదు. అందువలన కృతయుగములోనే మొదటి భాష అయిన తెలుగు భాషలో మాట్లాడి, మనువుకు ఆకాశవాణి చెప్పిన జ్ఞానమును చెప్పడము జరిగినది. అలాగే కలియుగములో 1400 సంవత్సరముల క్రితము 'జిబ్రయేల్' అను పేరుతో క్రిందికి దిగివచ్చి, ముహమ్మద్ ప్రవక్తగారికి కృతయుగములో మనువుకు చెప్పిన జ్ఞానమునే చెప్పడము జరిగినది. మనువుకు చెప్పిన జ్ఞానమే చివరికి మారుచూ మారుచూ వచ్చి కలియుగము మొదటిలో ద్వాపరయుగము చివరిలో అనగా యుగ సంధిలో వ్యాసుని చేత **'భగవద్గీత'** గ్రంథముగా వ్రాయబడినది. అలాగే అదే జ్ఞానమే 1400 సంవత్సరములప్పుడు **'ఖుర్ఆన్'** గ్రంథముగా వ్రాయబడినది. దీనినిబట్టి చరిత్ర తెలిసిన వారికి రెండు గ్రంథములలోని జ్ఞానము ఒక్కటేయని తెలియబడుచున్నది.

అందువలన ఖుర్ఆన్ గ్రంథములో (4-103) ఆయత్ ఒక్క ముస్లీమ్‌లకే గాక హిందువులకు, క్రైస్థవులకు వర్తించునదిగా యున్నది. దీనినిబట్టి చూస్తే హిందువులు ఏ ఆరాధన చేయుచున్నారో దానికంటే వేరే ఆరాధనను నెలకొల్పుకోవలసిన అవసరమున్నది. అట్లే క్రైస్థవులు ఏ ఆరాధన (ప్రార్థన) చేయుచున్నారో దానికంటే వేరుగా యున్న ప్రార్థనను నెలకొల్పుకోవలసిన అవసరమున్నది. అట్లే ముస్లీమ్‌లు వారు చేయుచున్న నమాజ్‌ను వారు చేయుచూ, దానిని కాదని ప్రత్యేకముగా మరొక నమాజును నెలకొల్పుకోవలసిన అవసరమున్నది. అంతవరకు చేయని క్రొత్త నమాజును నెలకొల్పుకోమని చెప్పడమైనది. అలాగే నెలకొల్పుకోవలసిన అవసర మున్నది. అయితే దేవుడు ఈ విషయమును వాక్యరూపములో చెప్పినా 'నాకు తెలిసినది ఇంతే, నాకు తెలియనిదాని జోలికి నేను పోను' అని దేవుడు చెప్పిన వాక్యమును కూడా తెలియనివారు, చూడనివారు గలరు.

అటువంటి వారికి నాలాంటి వాడు ఎవడయినా వాక్యము ఇలా ఉన్నదని చూపినా, ఖుర్ఆన్ గ్రంథము జ్ఞానమును కూడా పెడచెవిన పెట్టి, మా పెద్దలు చెప్పినట్లు నడుచుకొనుచుందుమని చెప్పుచుందురు. పెద్దలు చెప్పినది వినడము మంచిదే అయినప్పుడు దేవుడు చెప్పినది వినడము మరీ మంచిదగును కదా! దేవునికంటే పెద్దలు కూడా చిన్నవారేయగుదురు. దేవుని మాటతో సమానముగా పెద్దల మాటలను పోల్చుకోకూడదు. దైవగ్రంథము లోని వాక్యమును వదలి, పెద్దలు పెట్టిన మత సాంప్రదాయములను అనుసరించి అట్లే నడచుకొంటే దేవునిమాటను గౌరవించని వారమగుదుము.

**ప్రశ్న :- మీరు చెప్పినది మంచిదే. అయితే కొందరు విద్వాంసులయిన ముస్లీమ్‌లు ఖుర్ఆన్ గ్రంథములోని ప్రతి వాక్యమును తెలిసిన పండితులుగా యుంటున్నవారు ఈ విషయమును గురించి ఇలా అంటున్నారు. (4-103) వ వాక్యములో చెప్పినది అర్థము కావాలంటే (4-102) వ వాక్యమును చూడాలి. అక్కడ యుద్ధ సమయములో 'కొందరు నమాజ్ చేయండి, కొందరు నమాజ్ చేయకుండా శత్రువుల ఎడల అప్రమత్తముగా యుండండి అనీ, మొదట కొందరు నమాజ్ చేసినప్పుడు కాపలా యున్న మిగతావారు తర్వాత నమాజ్ చేయండి' అనీ చెప్పియున్నట్లు కలదు. అలా మొదట కొందరు, రెండవ మారు కొందరు నమాజు చేయడము జరుగుచున్నది. నమాజు చేసేవాడిని ఉద్దేశించి నమాజును నెలకొల్పండి అని అన్నారు. అంతేగానీ రెండవవారు చేయునది క్రొత్త నమాజ్ కాదు. మొదట చేయునది, తర్వాత చేయునది రెండూ ఒకే నమాజుగా యున్నది. అది తెలియక కొందరు రెండవమారు రెండవ గుంపు చేయునది క్రొత్త నమాజ్‌కాదు. రెండూ ఒకే నమాజ్‌యని తెలియవలెను.**

**(4-102) (ఓ ప్రవక్తా!) "నీవు వారి మధ్యన ఉన్న సమయములో (యుద్ధము జరుగుతూ యుంటే) వారు నమాజ్ చేయటానికి సిద్ధమైనప్పుడు వారిలో ఒక వర్గము నీతోపాటు సాయుధులై నిలబడాలి. మరి వారు నమాజ్ చేయగానే మీ వెనక్కి వెళ్లిపోవాలి. అప్పటి వరకు నమాజ్ చేయని రెండవ గుంపు వచ్చి నీతోపాటు నమాజ్ చేయాలి. నమాజ్ చేసి ప్రక్కన యున్నవారు ఆయుధములు ధరించి అప్రమత్తముగా ఉండాలి" అని ఉంది.**

ఈ ఆయత్ యుద్ధసమయములో కూడా నమాజ్ చేయాలని, అప్పుడు అందరూ ఒకేమారు నమాజు చేయక రెండు గుంపులుగా చీలిపోయి ఒక గుంపు నమాజ్ చేయునప్పుడు మరొక గుంపు ఆయుధములు ధరించి నమాజ్ చేయువారికి కాపలా ఉండవలెననీ, అట్లే మొదటి గుంపు నమాజ్ అయిపోయినప్పుడు రెండవ గుంపు నమాజ్ చేయగా మొదటి గుంపు కాపలా ఉండవలెనని వాక్యములో చెప్పియున్నారు. మొదటి గుంపు నమాజ్ చేయగా తర్వాత రెండవ గుంపు చేయు నమాజ్‌ను 'నమాజ్‌ను నెలకొల్పమని' చెప్పారు. అందువలన ఉన్నది ఒకే నమాజ్, గుంపులు రెండు ఉండుట వలన ఒక గుంపు నమాజ్‌ను ఆచరించగానే రెండవ గుంపును నమాజ్ చేయమని చెప్పడములో అలా చెప్పారు తప్ప రెండవ నమాజ్ లేదు. నమాజులు ఒకటే ఉండును దానినే అందరూ ఆచరిస్తున్నారు. రెండవ క్రొత్త నమాజు లేదని చెప్పుచున్నారు. పొరపడి రెండవ గుంపును చేయమని చెప్పినదే రెండవ నమాజ్‌గా అని అంటున్నారు. దీనికి మీరు ఏమంటారో చెప్పండి?

**జవాబు :-** దేవుడు (అల్లాహ్) అనుగ్రహించినట్లు దైవగ్రంథములోని జ్ఞానము అర్థమగుచుండును. అలాగే ఇస్లామ్ పండితులకు అర్థమయి ఉండవచ్చును. పండితులు చెప్పినట్లు రెండవ గుంపు నమాజ్ చేయడమును వాక్యములో గల రెండవ నమాజ్‌గా అర్థము చేసుకొని యుండవచ్చును. అయితే అల్లాహ్ మనిషికి ఇచ్చిన బుద్ధితో ఆలోచిస్తే నాకు ఈ విధముగా అర్థమగుచున్నది. నేడు ముస్లీమ్ సమాజములో ఉన్నది ఒకే ఒక నమాజ్. ఒకే విధమైన నమాజునే ముస్లీమ్‌లందరూ చేయుచున్నారు. ఎన్ని గుంపుల మనుషులు గుంపుల వారిగా, ఎన్నిమార్లు చేసినా ఒకే నమాజ్‌యేగానీ అది రెండవ నమాజ్‌గా యుండదు. నమాజు ఏడు ఆయత్‌ల పఠనముతో కూడుకొని యుండును. ఏడు ఆయత్‌ల పఠనము లేనిది నమాజ్ పూర్తికాదు. నమాజు ముందు చేసినా వెనుక చేసినా, వేరువేరు సమయములలో చేసినా నమాజ్ అనునది ఒక్కటే. నమాజు క్రమశిక్షణతో కూడుకొనియున్నది. సామూహికముగానయినా చేయవచ్చును. ఎవరూ లేనిచోట ఒంటరిగా అయినా చేయవచ్చును. ఎలా చేసినా, ఎప్పుడు చేసినా నమాజ్ ఒక్కటేగానీ రెండవది లేనేలేదు. అయితే (4-103) లో నెరవేర్చే నమాజు వేరు, నెలకొల్పబడే నమాజు వేరుగా చెప్పియున్నారు. ఆచరించబడే నమాజును నేడు అందరూ ఆచరించుచున్నారు. యుద్ధ సమయములో ఒక గుంపు ముందు చేసిన నమాజునే రెండవ గుంపు కూడా చేయుచున్నది. అంతేగానీ ముందు గుంపు ఒక నమాజు చేస్తే రెండవ గుంపు రెండవ రకము నమాజును చేయలేదు. వాక్యములో చెప్పిన సారాంశములో అందరూ ఆచరించు నమాజ్‌ను చెప్పడమేకాక క్రొత్తగా స్థాపించబడే నమాజును గురించి చెప్పారు. రెండవ క్రొత్త నమాజును బయటపెట్టడము వలన దానిని ఒప్పుకొని కొందరి వలన పేచీలు వస్తాయేమోనని తెలిసి ముందే

సమయము అనుకూలించినప్పుడు, శాంతిభద్రతలున్నప్పుడు అని చెప్పారు. రెండవ నమాజు క్రొత్త నమాజు ఉందంటేనే అదేమిటని ఆలోచించకుండా దానిని గురించి వ్యతిరేఖముగా మాట్లాడు వారుందురు. అందువలన ముందే అనుకూలమైనప్పుడు అని చెప్పారు.

(4-102) వ వాక్యములో ఉన్న సమాచారములో క్రొత్త నమాజు లేనేలేదు, పాత నమాజును గురించే చెప్పారుగానీ అందరూ ఆచరించు నమాజ్‌కంటే వేరే నమాజును గురించి చెప్పలేదు. (4-103) లో మాత్రమే క్రొత్తగా స్థాపించవలసిన నమాజును గురించి చెప్పారు. అయినా ఆ క్రొత్త నమాజును ఇంతవరకు ఎవరూ స్థాపించలేదు. క్రొత్తగా స్థాపించవలసిన నమాజును గురించి ప్రత్యేకముగా అల్లాహ్ చెప్పలేదు. అల్లాహ్ ప్రత్యేకముగా క్రొత్త నమాజు ఇలా ఉంటుందని చెప్పియుంటే ప్రజలు దానిని స్థాపించేవారు, తర్వాత అందరూ ఆచరించేవారు. దేవుడు ప్రత్యేకమైన క్రొత్త నమాజును స్థాపించుకొమ్మన్నాడు గానీ, ఇదే క్రొత్త నమాజు అని ఏమాత్రము చెప్పలేదు. అలా ఎందుకు చెప్పలేదనగా! ముందు చెప్పిన రెండు దైవగ్రంథములలోనూ క్రొత్త నమాజును గురించి యున్నది. అట్లే చివరి దైవ గ్రంథమయిన ఖుర్‌ఆన్‌లో కూడా దానిని గురించి గలదు.

మూడు దైవగ్రంథములలో వెదికితే రెండవ రకమయిన క్రొత్త నమాజు కనిపించగలదు. అలా దైవగ్రంథములో వెదకకల్గి రెండవ నమాజును (ప్రార్థనను) తెలియగలిగినా అది తెలిసిన వానికి ఒక్కనికే ఉపయోగపడును. ఏ మతస్థుడయినా మొదటినుండి అలవాటయిన, మొదటి నుండి తెలిసిన నమాజునే ఆచరించుచున్నాడు. అది ఒక్కటే నమాజు అని అనుకొనుచున్నారు. గ్రంథములలో నిక్షిప్తమైయున్న నమాజు ఏమిటో ఎవరికీ తెలియదు. ఒకవేళ దానిని ఎవరయినా విశదీకరించి ఇదే క్రొత్త నమాజు

అని చెప్పినా, దాని విషయమును సంపూర్ణముగా తెలిసినా, దానిని అందరూ చేయలేరు. రెండవ నమాజును గురించి తెలిసినా, దానిని ఆచరించుటకు చాలామంది పూనుకొనినా ఒకరు లేక ఇద్దరు ఆ నమాజ్‌ను చేయగలరేమోగానీ, అందరూ ఆచరించలేరు. దేవుని ఆరాధనను దేనినయినా నమాజ్‌గానే చెప్పవచ్చును అని **"తౌహీదె ఉలూహియత్"** అని ముస్లీమ్ పెద్దలు చెప్పియున్నారు. అల్లాహ్ యొక్క రెండవ క్రొత్త ఆరాధన (నమాజు) "తౌహిదె ఉలూహియత్" కోవకు కూడా చెందినది కాదు. అదొక ప్రత్యేకమైన ఆరాధన. దానిని ప్రయత్నించి చేయలేక వదలివేసినవారు కూడా కలరు. పట్టుదల గల జ్ఞానసంపన్నులైన వారు దానిని సాధించి ఆచరించినవారు కూడా కలరు. తౌరాతు (భగవద్గీత), ఇంజీలు (బైబిలు) గ్రంథముల జ్ఞానమును చెప్పిన కృష్ణుడు, ఏసు ఇద్దరూ రెండవ నమాజ్‌నే ఆచరించారు. మా వలె మీరు కూడా ఆచరించమని కృష్ణుడు తన గ్రంథములో చెప్పియున్నాడు. మొదట వహీ ద్వారా వచ్చిన జ్ఞానములో రెంవవ నమాజును గురించి యున్నది. అందువలన చివరిలో ఖుర్ఆన్ జ్ఞానమును చెప్పిన జిబ్రయేల్ తన జ్ఞానములో రెండవ ఆరాధనను గురించి చాలాచోట్ల చెప్పాడు. అయినా ఖుర్ఆన్ గ్రంథములో రెంవవ నమాజు వివరము గలదని ముస్లీమ్‌లకు తెలియకుండా పోయినది. అందువలన (4-103) లో ప్రత్యేకముగా నమాజును నెలకొల్పండియని చెప్పాడు. అయినా ఆ ఆయత్‌ను ముస్లీమ్‌లు చూచి ఆరాధన అంటే ఒకటేయనీ, ప్రార్థన (నమాజు) తాము చేయునదేయని అనుకొంటున్నారు.

**ప్రశ్న :- మీరు చెప్పునది కొంత సత్యమే అనిపించినా ఒక ప్రక్క సత్యము కాదనిపించుచున్నది. మీరు సత్యమును చెప్పాలని తాపత్రయపడుచు చెప్పుచున్న విధానమునుబట్టి మీరు చెప్పునది సత్యమే అనిపించినా ఇంకా**

మాకు ఆటంకముగా కనిపించు కొన్ని వాక్యములనుబట్టి దీనికేమంటారు అని అడుగవలసి వచ్చినది. ఇంకొక చోట కూడా నమాజు స్థాపించండి అను పదముతోనే చెప్పారు. ఆ వాక్యమునుబట్టి మేము ఏమనుకోవాలో మీరే చెప్పండి.

**(17-78) "నమాజును నెలకొల్పు. సూర్యుడు నెత్తి నుండి వాలినప్పటి నుంచి రాత్రి చీకటి అలుముకొనే వరకు" అని చెప్పబడియున్నది. దీనినిబట్టి నమాజును చేస్తూనే ఉండు అని ఉంది కదా! ఈ వాక్యములో చెప్పినది ఒకే నమాజు కదా! రెండవ నమాజు పేరు లేదు కదా! (4-103) లో చెప్పినట్లే నమాజును నెలకొల్పమని మొదటనే చెప్పారు. దీనిని చూచిన తర్వాత మీకు ఏమనిపిస్తావుంది? ఇక్కడ ఏ నమాజును గురించి చెప్పియున్నారు? అను ప్రశ్నలు వస్తున్నవి. దీనికి మీరేమంటారు?**

**జవాబు :-** మిమ్ములను తప్పుదారి పట్టించాలనునది నా ఉద్దేశ్యము కాదు. సత్యము చెప్పాలనునదే నా ఉద్దేశ్యము. దాని ప్రకారము చెప్పుచున్నాను. పైగా ఒక ఆయత్‌కు తప్పు వివరము ఇస్తే ఘోరమైన పాపము వస్తుందని సూరా 41, ఆయత్ 40లో కలదు.

**(41-40) "మా వాక్యాల విషయములో వక్రవైఖరిని అవలంభించి అసత్యాలను కూర్చి చెప్పు వారిని మేము చూస్తూనే యున్నాము. అగ్నిలో పడవేయబడువాడు మేలా? లేక ప్రళయ దినాన సురక్షితముగా ప్రశాంత స్థితిలో వచ్చేవాడు మేలా? మీరు ఇష్టమొచ్చింది చేసుకొంటూ పోండి. ఆయన (అల్లాహ్) మీరు చేసే పనులన్నీ చూస్తూనే యున్నాడు."**

ఆయత్‌లో దేవుని వాక్యమునకు తప్పు భావమును వ్రాస్తే మరణానంతరము అగ్నిలో పడవేయబడుదురు అని చెప్పిన తర్వాత కూడా ఎవరూ ఆయత్‌ల జోలికి పోరు. సత్యము తెలిసియుంటే బయటికి చెప్పగలరు గానీ వాక్యమును గురించి తెలియకపోతే ఊరకనే ఉండును. నాకు సత్యము తెలిసింది కావున ధైర్యముగా బయటికి చెప్పుచున్నాను. బుద్ధి పెట్టి యోచించువారికి నా మాటలలోని సత్యము తెలియగలదు. ఇప్పుడు మీరు (17-78)వ ఆయత్‌లోని వాక్యమును చెప్పారు. ఇక్కడ నమాజును నెలకొల్పమని చెప్పారు. కావున క్రొత్త నమాజును గురించి చెప్పారని తెలియుచున్నది. తలమీది సూర్యుడు తిరిగినప్పటినుండి రాత్రి చీకటి పడే వరకు క్రొత్త నమాజ్‌ను వదలకుండా చేయవచ్చును. అదే పాత నమాజు అయితే నిర్ణయమైన కాలములలో క్రమశిక్షణగా సామూహికముగా నమాజు చేయవలసి యుండును. క్రొత్త నమాజుకు నియమాలు లేవు. మధ్యాహ్నము నుండి రాత్రివరకు ఏకధాటిగా చేయు నమాజ్ క్రొత్తదికాగా, పాత నమాజ్ ఏకధాటిగా చేయునది కాదు. దీనినిబట్టి (17-78) ఆయత్‌లో క్రొత్త నమాజును గురించి చెప్పియున్నారు గానీ పాత నమాజ్‌ను చెప్పలేదని తెలియుచున్నది. పాత నమాజ్ నియమములతో కూడినదనీ, ఏకధాటిగా చేయునది కాదని ముస్లీమ్‌లందరికీ తెలుసు. పాత నమాజును గురించి అందరికీ తెలుసు, క్రొత్త నమాజును గురించి ఎవరికీ తెలియదు. మేము చెప్పుతూయుంటే, ఇప్పుడే తొలిసారిగా క్రొత్త నమాజు అను పేరును వినుచుందురు. ఇప్పుడయినా గ్రంథములో చెప్పిన క్రొత్త నమాజును గురించి తెలియవచ్చును కదా! మూడు దైవ గ్రంథములలో మనకు తెలియని క్రొత్త నమాజ్‌ను గురించి ముఖ్యముగా చెప్పియున్నారు. మనిషికి బోధించిన జ్ఞానములో ప్రధానముగా క్రొత్త నమాజును గురించే

గలదు. అటువంటప్పుడు క్రొత్త నమాజ్‌ను గురించి అందరూ తెలిసి గ్రంథములో చెప్పినట్లు ఏకదాటిగా నమాజ్‌ను చేయవచ్చును కదా!

మూడు దైవ గ్రంథములలో క్రొత్త నమాజును గురించి యుండడము వాస్తవమేయని దానిని గురించి తెలిసిన మేము చెప్పుచున్నాము. ఇంకా వివరముగా చెప్పితే ప్రథమ దైవ గ్రంథము భగవద్గీతలో క్రొత్త నమాజును గురించి ఎక్కువ శాతము చెప్పబడినది. ద్వితీయ దైవ గ్రంథమయిన బైబిలులో భగవద్గీతలో చెప్పిన దానికంటే కొంత తక్కువ చెప్పియున్నారు. అంతిమ దైవ గ్రంథము ఖుర్‌ఆన్ గ్రంథములో ద్వితీయ దైవ గ్రంథములో కంటే తక్కువ చెప్పియున్నారు. తౌరాతు గ్రంథములో దాదాపు **60** శాతము కొత్త నమాజ్‌ను గురించి చెప్పగా, ఇంజీలు గ్రంథములో **30** శాతము చెప్పారు. ఖుర్‌ఆన్ గ్రంథములో **15** శాతము చెప్పారు. మూడు దైవ గ్రంథములలో ఇంత శాతము చెప్పారని కొలత వేసి మేము చెప్పుచున్నా మంటే అదేదో గ్రంథములో యున్నా చదివిన వారికి అర్థము కాలేదనేగా తెలియుచున్నది. మాకు తెలిసినది మీకు కూడా తెలియగలదు. మీకు తెలిసిన వరకే గోడకట్టుకొని ఇంతే ఉన్నది అనుకోకూడదు. దైవ గ్రంథములలో మనకు తెలియనిది ఎంతో గలదు. అందువలన బుద్ధిని ఉపయోగించి ప్రతి వాక్యమును చూడవలెనని తెలుపుచున్నాము.

**ప్రశ్న :- మూడు దైవ గ్రంథములలో క్రొత్త నమాజ్‌ను గురించి చెప్పి యున్నారని మీరు తెలుపుచుండగా మేము వింటున్నాము. మాకు ఎందుకు తెలియలేదో, మీకు ఎందుకు తెలిసిందో? మీకు తెలిసింది కదా! ఇప్పుడయినా అందరికీ ఆ నమాజును గురించి మీరు తెలియ చెప్పవచ్చును కదా! ఇంతవరకు మీరు ఆ క్రొత్త నమాజు ఇలా చేయవలెనని చెప్పలేదు. ఇప్పుడయినా ఆ క్రొత్త నమాజును ఎలా నెలకొల్పాలో? ఎలా ఆచరించాలో**

**చెప్పవలెనని అడుగుచున్నాము. దయచేసి మీకు తెలిసినదంతా మాకు తెలుపవలెను.**

**జవాబు :-** నాకు తెలిసినది నేను చెప్పగలను. అయితే గ్రంథములో ఎన్నోచోట్ల గల దానిని ఎవరంతకు వారు తెలుసుకొని ఆచరించినప్పుడు దానికి విలువ యుండును. నమాజ్ అను పేరుకు సార్థకము చేకూరును. క్రొత్త ప్రార్థన లేక నమాజు వలన మనిషి పరలోకమును చేరు భాగ్యము కల్గును. **"నాకు జన్మ వద్దు"** అను అర్థమును నమాజ్ అనే మూడు అక్షరములు తెల్పుచున్నవి. ఒకప్పుడు కృతయుగములోనే నమాజ్ అనునది స్వచ్ఛమయిన తెలుగు పదముగా ఉండేదని ముందే చెప్పుకొన్నాము. దాని అర్థము తెలుగులో **న** అంటే వద్దు. **మ** అంటే నాకు, **జ్** అంటే జన్మలు. 'నాకు జన్మలు వద్దు' అను మాటను కుదించిన అక్షరములలో నమాజ్ యని అన్నారు. క్రొత్త నమాజ్ (ఆరాధన) అయితే దాని అర్థమునకు సరిపోవునదిగా యున్నది. అహర్నిశలు చేయునది ఒకే ఒక ఆరాధన కలదు. అదే క్రొత్త నమాజ్. నీకు క్రొత్త నమాజ్‌యని చెప్పుచున్నా నాకు మాత్రము అలవాటుపడిన పనిగా యున్నది. అందరికీ తెలిసిన పాత నమాజ్ దేవుని మీద విశ్వాసమున్న వారు అనగా ముస్లీమ్‌లు అదొక పనిగా చేయుచున్నారు. అయితే అందరి దృష్టిలో క్రొత్త నమాజ్‌గా గ్రంథములో చెప్పబడినది ప్రత్యేకించి చేయు కార్యము కూడా కాదు. అందరికీ అర్థమయ్యే దానికి నేను క్రొత్త నమాజ్‌ను చేస్తున్నాను అని చెప్పినా అది నేను చేయునది కాదు. అది అందరిలో జరుగుచున్నది. నాలో కూడా జరుగుచున్నది. జరుగుచున్న దానిమీద ధ్యాసను పెట్టుకొన్నాను. కావున అది నేను చేసినట్లగుచున్నది. అంతేగానీ క్రొత్త నమాజ్‌ను ప్రత్యేకించి పాత నమాజ్‌వలె చేయునది కాదు. ఎవరికి తెలిసినది వారు చేయుట అని చెప్పవచ్చును

గానీ ప్రత్యేకముగా చేయునది కాదు కనుక సామూహికముగా చేయలేము. నియమిత కాలములో అనునదే ఉండదు. బయటికి కనిపించునది కాదు. పాత నమాజ్ బయటికి తెలియును. పాత నమాజ్‌ను చేయువారిని చూడ వచ్చును. క్రొత్త నమాజ్‌ను చేయువారు ప్రక్కలోయున్నా వారిని గురించి మనకు తెలియదు.

చాలామంది ముస్లీమ్ పెద్దలు అందరూ చేయు నమాజ్‌ను కుదించిన నమాజ్ యని అనుచుందురు. భయముతో నియమముతో చేయు నమాజ్‌ను కట్టివేయబడిన నమాజ్, కుదించబడిన నమాజ్‌యని అనుచుందురు. క్రొత్తగా నెలకొల్పమని చెప్పిన నమాజ్ కుదించబడిన నమాజ్ కాదు. ఇంతే సమయములో ఇట్లే చేయవలెనను నియమము లేదు. అందువలన అందరూ ప్రతి దినము చేయు నమాజ్‌కంటే ప్రత్యేకమయినది. నిత్యము అందరూ ఒకచోట గుమికూడి చేయు నమాజ్ ఏడు ఆయత్‌ల పఠనముతో కూడుకొనియుండును. మిగతా మతములలో కూడా ఏవో మాటలతోనో, మంత్రములతోనో వారి ఆరాధనలు కూడుకొని యుండును. క్రైస్థవుల ఆరాధన మాటలతో, హిందువుల ఆరాధన మంత్రములతో కూడుకొన్నట్లు ముస్లీమ్‌ల ఆరాధన (నమాజ్) ఏడు వాక్యముల పఠనముతో కూడుకొని యుండును. ఆ ఏడు ఆయత్‌లలో ముందు నాలుగు అల్లాహ్‌ను పొగడునవి, తర్వాత మూడు అర్థించునవిగా యున్నవి. దేవుని ఆరాధనలో ఈ రెండు విధానములు అన్ని మతములయందు గలవు. పొగడడము, అడుగుకోవడము దేవుని వద్దే కాకుండా ప్రపంచ వ్యవహారములలో కూడా యున్నది. ప్రపంచ వ్యవహారములలో కూడా ఒకనిని ముందు పొగిడి తర్వాత అడిగితే వాడు ఏమయినా ఇవ్వగలడు. పొగడకుండా అడిగితే ఎవడూ ఏమీ ఇవ్వడు. అదే సూత్రమునే అందరూ దేవుని విషయములో

కూడా ఉపయోగించారు. ముందు ప్రసన్నత కొరకు పొగడడము తర్వాత లబ్ధి కొరకు అర్థించడము జరుగుచున్నది. ప్రపంచములో ఉపయోగించు విధానమును దేవుని విషయములో ఉపయోగించడము దేవునికి ఇష్టము లేదు. దానివలన మనుషులను, దేవున్ని సమానము చేసినట్లగును.

అయితే మనుషులకు తెలిసిన విధానము ఒక్కటే అయినప్పుడు అదే విధానము ప్రకారము దేవుని ఆరాధన విషయములో ముందు పొగడడము తర్వాత అడగడము అను రెండు పద్ధతులు గల దానినే ఆచరించుచున్నారు. ఈ విధానము ఒక మతమునకే కాకుండా మనుషులున్న ప్రతీ మతములో గలదు. ఒక మనిషి నుండి లాభమును పొందవలసినప్పుడు వానిని పొగిడితే వాడు ప్రసన్నుడవును. తర్వాత వానిని అర్థించితే అప్పుడు వాడు ఇచ్చుట జరుగుచున్నది. ప్రపంచ విషయములో ముఖ్యమయిన దానినిగానీ, ముఖ్యముకాని దానినిగానీ అర్థించడము జరుగుచున్నది. దేవుని వద్ద కూడా మనిషి అలాగే అర్థించు చున్నాడు. అయితే దేవుని వద్ద అర్థించవలసినది ముఖ్యమైనదయిన పరలోకము. దానిని **మోక్షము** అని అంటున్నాము. ముఖ్యమైన ముక్తిని గురించి అడగడమును ప్రార్థన అని అనవచ్చును. 'ప్ర' అనగా ముఖ్యమైన అనీ, అర్థన అనగా అడుగుకోవడము అని చెప్పవచ్చును. ప్ర+అర్థన=ప్రార్థన అని అంటున్నాము. అయితే నేడు చాలామంది ముఖ్యముకాని దానిని దేవుని వద్ద అడుగుచూ, దానిని కూడా ప్రార్థనయని అంటున్నారు. ముఖ్యము కాని దానిని అడగడము దేవునికి కూడా సరిపోదు. అంతేకాక అందరినీ పొగడినట్లు తనను పొగడడము, అందరినీ అడిగినట్లు తనను అడగడము దేవునికి ఏమాత్రము సరిపోలేదు. అలా చేయడము వలన మనుషులను, దేవున్ని కలిపివేసినట్లగుచున్నది.

మనుషులలో హిందువులు ధ్యానము అనీ, క్రైస్థవులు ప్రార్థనయనీ, ముస్లీమ్‌లు నమాజ్ అను పేర్లతో చేయు ఆరాధనలు ఏవీ దేవునికి (అల్లాహ్) కు సరిపోవు. అందువలన మూడు మతములలో యున్న మనుషులకు తనను ఎలా ఆరాధించవలెనో తెలుపుచూ నేడు దేవుని విధానములో చేయు ఆరాధనలన్నీ ఏవీ తనకు సరిపోవనీ, తనకు ఇష్టము లేదని తెలిపి తనకిష్టమైన విధానమును ప్రజలకు తన గ్రంథముల ద్వారా తెలియజేశాడు. మనిషి తనతో కలియవలెనని అనుకోవడమే తనకు ఇష్టమనీ, మిగతా ఏవీ తనకు ఇష్టము లేదని తెలియజేశాడు. అదే విషయమునే తన గ్రంథములలో కలయిక లేక ఐక్యము అను అర్థముతో తన ప్రార్థనను గురించి చెప్పాడు. దేవుడు తన మూడు గ్రంథములలో చెప్పిన దానిని నేడు క్రొత్త నమాజ్ అని అంటున్నాము. పాత నమాజ్ మనుషులు సృష్ఠించుకొన్నది. క్రొత్త నమాజ్ దేవుడు సృష్ఠించినది. అందువలన దైవ గ్రంథములలో క్రొత్త నమాజ్‌ను నెలకొల్పమని చెప్పాడుగానీ, పాత నమాజ్‌ను గురించి ఎక్కడా ఏమీ చెప్పలేదు. పాత నమాజ్ ముస్లీమ్‌లలో, ధ్యానము హిందువులలో ప్రార్థన అను పేర్లతో క్రైస్థవుల యందు ఉండుట సహజమే. అయితే మూడు మతముల ప్రజలలో అందరూ ధ్యానము, ప్రార్థన, నమాజ్‌లను ఆచరించడము లేదు. దేవుని భయము యున్నవారు కొందరు, అట్లే దేవుని మీద భక్తియున్నవారు కొందరూ అనగా దేవుని మీద భక్తితోనో, భయముతోనో ప్రార్థన చేయుచున్నారు. మరికొందరు లాభము కొరకు చేయుచున్నారు. ఎలా చేసినా నూటికి నూరుమంది దేవుని ఆరాధనలు చేయడము లేదు. కొందరు మాత్రమే ఆరాధన చేయుచున్నారు. కొందరు దేవుడున్నాడని నమ్మకమున్నా ఆరాధనలు చేయకున్నారు. కొందరు దేవుడు ఉన్నాడను నమ్మకము కూడా లేకుండా నాస్తికులుగా యున్నారు. వారు ఆరాధనలు చేయరు, ఆరాధనలలో పాల్గొనరు.

భారతదేశములోనే మొట్టమొదట దేవుడు మరియు దయ్యమును గురించి తెలిసినది. అప్పుడు హిందూ సమాజము కలదు. అప్పుడు కొందరు జ్ఞానులు తమకున్న జ్ఞానము చేత దయ్యమును వదలి దేవున్ని ఆరాధించ వలెనని తెలుసుకొన్నారు. ఆ క్రమములో దేవుడు ఎవరో తెలియక దయ్యములను అనేక దేవతలుగా ఆరాధించను మొదలుపెట్టారు. ఆ సమయములో దేవుడు తన జ్ఞానమును ప్రజలకు తెలియబరచుటకు ఆకాశ వాణి ద్వారా జ్ఞానమును పంపడము, చివరికది సూర్యుని ద్వారా భూమికి చేరడము జరిగినది. అయినా భూమిమీద దేవుని జ్ఞానము మనుషులందరికీ తెలియుటకు చాలా కాలము పట్టినది. కొందరికి దేవుని జ్ఞానము తెలిసినా ముందునుండి అలవాటు పడిన పనులనే చేయుచూ దైవజ్ఞానము తెలియుట వరకే అన్నట్లుండిరి. కొందరు మాత్రము దేవుని జ్ఞానము తెలిసి, జ్ఞానము ప్రకారము నడుచుకొనేవారు. మొదట దైవజ్ఞానము కొంతవరకు భారతదేశమంతా ప్రాకినా తర్వాత మాయ ప్రభావము వలన జ్ఞానము, అజ్ఞానముల మధ్యలో కొందరు అటు, కొందరు ఇటు మారుచూ చివరికి అజ్ఞానమే ఎక్కువగా పెరిగిపోయినది.

అటువంటి పరిస్థితులలో మనిషి దేవుని వద్దనుండి కొందరు, దేవతల వద్దనుండి చాలామంది కోర్కెలను కోరను మొదలుపెట్టారు. ఇతరులను ఏదయినా అడుగునప్పుడు అడిగేవారు అడుగవలసిన వాని మెప్పును పొందితే అడిగినది తప్పక ఇచ్చునను ఉద్దేశ్యముతో కోర్కెలతో కూడుకొన్న వారు తాము ఆరాధించు దేవున్నిగానీ, దేవతలనుగానీ ముందు బాగా పొగిడేవారు. తర్వాత తమ కోర్కెలను వెలిబుచ్చి అడిగేవారు. దానినే మొదట ఆరాధనయని అన్నారు. ఆ రోజులలో ధనమే అన్నిటికీ మూలము అని ధనము ఉంటే అన్ని పనులు జరుగునని తలచి దేవతా పూజలలోగానీ,

దేవుని పూజలోగానీ చివరకు ధనమునే కోరుచుండిరి. ధనమును కోరుటకు చేయవలసిన ఆరాధనలను మనిషి ఏర్పరచుకున్నాడు. ఆనాడు ఈనాడు చేయు పూజలను ఆరాధన యనుటలో అర్థము గలదు. ఆరాధన పదమును విభజించి చూస్తే చివరిలో 'ధన'యని కలదు. దేవతల వద్ద తమకు కావలసిన ధనము కొరకు ఆరా తీయడమును ఆరాధనయని చెప్పడము జరుగుచున్నది. మొదట ఆ విధముగా దేవతలవద్ద ఆరాధనలు తయారు కాగా, చివరకు దేవునివద్ద కూడా అదే ఆరాధనను చేయుటకు మొదలు పెట్టారు. వాస్తవముగా దేవునివద్ద చేయు ఆరాధన వేరు, దేవతల వద్ద చేయు ఆరాధన వేరు.

దేవతల వద్ద చేయు ఆరాధన ప్రపంచ ధనమును ఆశించి చేయునది యని చెప్పవచ్చును. అదే దేవుని వద్ద చేయు ఆరాధన జ్ఞాన ధనమును ఆశించి చేయునదియని చెప్పవచ్చును. రెండూ ఆరాధనలే అయినా ఒకటి దేవుని వద్ద, రెండవది దేవతల వద్ద చేయునదిగా యున్నది. దీనినిబట్టి ఆరాధనలు రెండు తెగలని చెప్పవచ్చును. దేవునివద్ద చేయు ఆరాధన జన్మలు లేని మోక్ష స్థితికి అనగా పరలోకమునకు తీసుకొని పోవును. దేవతల వద్ద చేయు ఆరాధన జన్మలకు తీసుకొని పోవునదిగా యున్నది. మనుషులు ఎక్కువగా జన్మలు కలుగజేయు దేవతా ఆరాధనలే చేయు చున్నారు. జన్మలు లేకుండా చేయు ఆరాధనలు దేవుడు నిర్ణయము చేసి చెప్పియున్నాడు. దేవుడు చెప్పినట్లు చేయు ఆరాధనలు జన్మలు లేకుండా చేయును. కనుక అటువంటి ఆరాధనలను **"నమాజ్"** అని పేరుపెట్టి చెప్పడము జరిగినది. నమాజ్ అనగా జన్మలు లేకుండా పోవడము అని అర్థమును తెలుపుచున్నది. **'న'** అనగా వద్దు, **'మ'** అనగా నాకు, **'జ'** అనగా జన్మలు అని చెప్పవచ్చును. దేవుని ఆరాధనను నమాజ్ అని

పూర్వము కృతయుగము లోనే హిందువులు చెప్పేవారు. భూత కాలములో లేదు, భవిష్యత్తు కాలములో లేదు అని చెప్పుటకు "న భూతో న భవిష్యత్" అని చెప్పినట్లు "జన్మల విషయములో జన్మలు వద్దు, జన్మలు లేవు" అని చెప్పుటకు నమాజ్ అని చెప్పారు. జన్మలు లేకుండా దేవునిలోనికి ఐక్యమగు కోర్కెను తెలుపునదే నమాజ్ అని అర్థము. అయితే నేడు దేవుని ప్రార్థనలో కూడా ఏదో ప్రపంచ కోర్కెలను ఆశించి చేయు ఆరాధనను నమాజ్ అని అంటున్నారు.

ప్రపంచ ధనమును ఆశించి దేవతలను పూజించువారు తమ పూజలను ఆరాధనయని అన్నట్లు అట్లే పరమాత్మ ధనమును ఆశించి పూజించు వారు కూడా తమది ఆరాధనేయని చెప్పుచున్నట్లు రెండు రకముల ఆరాధనలను దేవుడు దేవతల పట్ల చేసినట్లు, రెండు రకముల నమాజ్‌లను దేవునివద్ద చేయుచున్నారు. దానినే ఖుర్ఆన్ గ్రంథములో (4-103) లో గల అందరూ చేయు పాత నమాజు అనియూ, ఒక్క మనిషి అయినా క్రొత్తగా నెలకొల్పు దానిని క్రొత్త నమాజు అనియూ రెండు రకములు గలవు. ఆ రెండు రకములు తెలియక ముస్లీమ్‌లు నమాజ్ ఒక్కటేయని అనుకొన్నారు.

ద్వాపరయుగము వరకు భూమిమీద మతములు లేవు. ఉన్న వారందరూ ఇందువులే యగుట వలన ఈ దేశమును ఇందూదేశము అని అన్నారు. ఇందూ అను పేరుతో ఇందువులు ఉండేవారు. ఈ మధ్య కాలములో దాదాపు 100 నుండి 150 సంవత్సరముల క్రితము **'ఇందూ'** అను శబ్దము, **'హిందూ'** అను శబ్దముగా మారిపోయినది. కలియుగము ప్రారంభమయిన తర్వాత మూడువేల సంవత్సరములకు మతములు అనునవి పుట్టుకొచ్చినవి. అలా పుట్టిన వాటిలో మొదటిది క్రైస్థవ మతము.

